# ఆ శీ స్సు

శ్రీ శైల కనకలింగా
ధీ శిత బందాన్వయాంబుధిసుధాభంగా !
ఆశీర్వాదము లివి శ్రీ
వేళంతము నవగృహప్రవేశము వేళన్

ఆశీర్వదింతు నిన్నును
శ్రీ శర్మాయుః కళాప్రసిద్ధులు పొంగన్
శ్రీ శర్మాయుః కీర్తుల
రాశి యయిన కొడుకు గలిగి రాజిల్లంగన్

ఆయెడ నీ పదేండ్ల వయసప్పుడు చిన్నెలపాట కాటకున్
నీయెడ ముద్దుచేసిరఁట నెట్టన నీకృతిలోని నాయికా
నాయకు లద్ది యంకిత మనం జను నియ్యది ముద్దుబిడ్డలా
నీయెలనాగయున్ మఱియు నీవును పున్నెపుఁబేమ దిద్దుకోన్

# శశిదూతము

అమృతము కూడుకట్టినదొరా ! యల దూరపునీలికొండలోఁ
గొమరుమిగుల్ సితాంబుదముకొసల మూసలు పోతు వెన్నెలల్
రమణి యొకింతకోపన పరాఙ్ముఖియైనది, నాకుఁ జెప్పఁగో
నమరినదూత యిప్పు డెవరందువు నీవువినా నిశాపతీ !

అమృతపుబిందుకాల్వవలె నట్టిటు మోచి విశాఖకృష్ణపా
ద్యమిఁదొలివంకతోఁచని విడంబనలోపము లేదు నీదెసన్
రమణి యొకింతకోపన పరాఙ్ముఖియైనది, దానికింత కో
పము మఱి నీసమక్షమున వచ్చిన దేమివిచిత్రమో శశీ !

కమలముఖంబునందుఁ జుఱుకల్ వలెనై పనిసేయు వెల్గుమొ
త్తములకు నీవొకండు రహదారివి నీ వెలుఁగారుదారులన్
రమణి యొకింతకోపన పరాఙ్ముఖియైనది, కాక లెక్కవై
చిమిడెనొ నీదువెల్గుతుధిసీమలు చామలబియ్యముంబలెన్

నీవయి నాకు నమ్మకము నింగిని గ్రొంజాఱక త్రివెల్గు బు
ద్దీఁ విభావమైన తెలిదివ్వెవు మవ్వపు నీదువెల్గులోఁ
గోపనమై పరాఙ్ముఖితఁ గొన్నది నా ప్రియురాలు నీవుగా
పాపటఁ దోలు మీఁకఱినభావపుఁ జిన్నిపౌలాలలోఁ పలన్

ననవిలుకానికిన్ మొదలినాళ్లు వసంతుఁడు కాని, పాదురా
లని తొలిపూవులై నెలనెలన్ జిగిపున్నమ కట్టు లిట్టులన్
నినిచిన ఱేక లొప్ప హావణించిన నీవాకరుండె మంత్రి నీ
వనిత పరాఙ్ముఖిత్వ మొక బ్రాంతియఁ జే నినుబోటివానికిన్

ఱేనయి యిట్టులైతి, బెదరింతును పో పవలైన, ఱేయియా
లే నిలు, కల్వఱేఁడవును లే చనుదెంచును లే యటంచు, నీ
వా నిలుచున్న వైఖరిని నాలనపాలన లేక చూతువే
కాని తలంచ వింత చెలికారము నాయభిమానమున్ సఖా!

వితతములైన దంపతుల ప్రేమలకున్ గొలపాత్రవౌచు ని
ల్చితి పదునాఱు ఱేకలును జెప్పక చెప్పెదుపో రసార్ద్రిమా
గతులను నేఁడొకం డనుటెగాని కొఱంతయె కానరాదు నీ
జతనము నిండియున్నదను సాకున నంతయు నిండుకొన్నదో!

మొగుడలు పూలు నీవు నొకమో స్తరుకోమలజీవు లంచు బి
ట్టుగ నిదియొక్క పూవులకుటుంబము మీర లొకళ్లొకళ్లకున్
మిగులఁగ స్నిగ్ధులౌదురును మీఱును మీఱును నొక్కఁడౌట నీ
వగుదువు నాకు దూత్యమున కంగనకున్ మృదుకోపశీలకున్

నీ వల తాకినన్ బ్రణయనిస్పృహురాలగుఁ గల్యచేడె మీ
భావము లచ్చసాత్త్వికపుభావనిధుల్ రససిద్ధివేళ మా
భావపుసీమలెల్ల ననుభావవిభావవిమిశ్రితంబులౌ
ప్రోవులుగాన మీకు దయపుట్టక లేవు రసాధిపత్యముల్

కడలిని జిల్కనట్టి తొలికాలమునందున మంథరంబునం
దడుగున రాయిడించి పులకై జలదేవత మూలశైత్యముల్
బుడగలుగాఁగఁ దేటికొని పొందిన చల్లదనాల తెట్టె వీ
వెడరున నేచి తాకితివయేనిని గోపములంచు నిల్చునే ?

నీవు ప్రసన్నతాగుణఖనీ ! యలవేదములందు మెచ్చుగా
న్నా వఖిలాండబీజుని మనస్సుననుండి సముద్భవించి తం
చీ వఖిలౌషధీశుఁడవు నీవు మహాత్ముఁడ వాకసంబులో
నీ వొకపూలదీపమవు నీవమృతాకృతి వయ్య మత్సఖా !

తెలివినువాఁకతాపులకుఁ దీరము పట్టిన వెల్లశుక్తివై
తొలివెలుఁగైన సామి తలతోటను జిట్టచిటారుపూవువై
యల ముగ్గురైన మూర్తులకు నాదినిధానము సృష్టిబీజమౌ
సొలపున కిక్క తల్లి కులసుందరి పాపటులోని భూషవై

కడలిజలంబునం దిమిడికల్ గను నుప్పులు కాలకూటమై
వెడలిననాఁడు నీరముల వెల్లువ చల్లదనంబు నీవుగా
వెడలితి, వాదిదేవుగళపీఠిక నిల్చిన కాలకూటమం
దుడుకులపొంగు లార్పుటకె యుంటివి శ్రీప్రభు దేవుమౌళిపై

నెలఁతల బాధవెట్టెదవు నీవును, వారును నిన్ను నాటఁగాఁ
బలికెద రొక్కవేళ, నొకపట్టున నీవు సతుల్ మనమ్మైక్యమై
వెలిఁగెద రింక నీనడిమి వెఱ్ఱులకేటికిఁ బ్రేమచోట్లనే
తెలతురు కోపగింతురుగదే జగమందున నెవ్వరేనియున్

నిను విరహార్తలా సతులు నెవ్వగనాడిన మున్ను నీవు చే
సిన సుఖశీతలత్వపురుచిన్ స్మరియించుట కాని యాడుటా?
వనితలు నీకు సోదరులు వారికి సోదరుఁడీవు మీకు మీ
కును గల గర్భబంధములకున్ గొనసాగుట నీ ప్రశాంతియే

వెన్నునికున్న మచ్చ యరవిందము రత్నము భోగిలక్షణం,
బెన్నఁగ నీదుమచ్చ యది యేమొ కళంకము, నిచ్చకాలసన్
దిన్నగ నిట్ల యుండునుగదే! గిరికవ్వము దూసిచన్న నీ
యన్నువమచ్చ నెవ్వరెటు లాడిననున్ మనకేమి లే సఖా!

నీవుదయింతు తూర్పుమలనెత్తములందునఁ గుంకుమావృతం
బై వలిపంపురైక బయలాడిన తూరుపుకన్నె బొమ్మగా
నావల యక్షదంపతుల యారని ప్రేమలబావియూటయై
నీవెలుఁ గారుఁ బ్రాగ్గిరివనీతరువల్లిఁ బ్రవాళశోభయై

పున్నమనాఁడు ప్రాచిగిరిమూలము నెత్తిగ ముట్టుకొందు మా
యన్నలు నప్పుడే తిలక మాననసీమల దిద్దుకొంద్రు నీ
వెన్నఁడు నెప్పుడెప్పు డుదయించెదు వారును నప్పుడప్పు డే
చిన్నెలొ భర్తృసంగమవశీకృతచిత్తలు తాల్చుచుందురున్

నాసఖి యన్నయిచ్చిన ననల్ జడలోఁ గయిసేసి మెల్లఁగా
నాసవిధంబుఁ జేరు వదనంబున హాసము లందగింపఁగా
నాసఖి నీదువెన్నెల ననల్ తనువెల్ల నలంకరింపఁగా
నాసవిధంబుఁ జేరు వదనంబున వెన్నెల లందగింపఁగా

నినుఁబలుసార్లు మత్ప్రణయినీమృదుకోపశిఖాపనోదకున్
మునుపటికే నెఱుంగుదును మున్నడి వెన్నుడి గాఁకఁదీర్చి తా
చనవునఁజేసియే యడుగసాగితి మాటను దీసివేయ కా
మునుపటిసంగడీనితనముల్ నిలబెట్టుము పట్టుకొమ్మవై

యుగములు గాఁగ దూత్యమున కొప్పితి పో ప్రణయోపజీవులం
దగణితబుద్ధి నాకు సఖుఁడైతివి యెన్నియొ కొన్నిసార్లు నీ
వగుపడవేలొ తొంటివలె హాస్యమొకో యెదియైన క్రొత్తయా
వగపు ఘటిల్లెనో తెలుపవా! మనచెల్మికి నాసవెట్టెదన్

ఇరవునవచ్చి నిన్ను నిడియించెనొ యీవడగాడ్పు లక్కటా!
మెరమెరలాడిపోయెదు సమీరుని యీపెనువెచ్చనైనలోఁ
బొరలను జెమ్మతోఁచ దవుపో! వడగట్టిన యెండుగందపుం
బెరడువిధాన నీవు వినువీథిక నిల్చితి వయ్యొ చంద్రమా!

పినునెడబాటుటగ్గికిఁ దపించిన నాతులపాలిటన్ సుద
ర్శనమవు వేయియంచులకరాసివి తాకినచోటఁ గోఁతవె
ట్టినదార వా ప్రభావములు డిందెనొ? వేసఁగికాఁక లేమి సే
సినవి పటీరవార్ద్రిలయశీతలమూర్తిని నిన్ను మిత్రమా!

రాతిరి రెండుజాలు చివరల్ సయితమ్మును వెచ్చనూఁదుచున్
జేతము సొమ్మసిల్లఁగను జేయుచు వేసఁగి గాలి యేచఁగా
నీ తెలివేమి? నీ చలువ నేరుపు లేమి? ప్రపంచమంతయున్
గాతరమయ్యె నిన్ను వడఁగట్టిన నేమనవచ్చు వేసఁగీ

అవునవు నిన్ను నే నెఱుఁగనా? తెలివెల్గులు బార్లుతీర్చినన్
సివమునఁ గామినీవిరహచేతములందున దాడిపోవు పా
టవమునఁ బొల్చు రాజు వికటప్రకటోల్బణవృత్తు లేమిపా
టివి? తొలివెచ్చగాలి వికటింపులు నిన్నిఁక నేమి సేసెడిన్

భ్రమితములైన గాలులకు వాడిన రేలచివుళ్ళవోలికన్
సిమసిమలాడుకొంచు విరిసెన్ నులివెచ్చని చిక్కవెన్నెలల్
శ్రమపడినట్లు మందగొడి సాగియు సాగవు క్రొత్తకాల్వనీ
రములును నెత్తెలం దడుపరాక విలంబన మొగ్గుపోలికన్

పగటను దూసికొంచు లయభాస్కరుఁ డీ వినువీథి నేగుచున్
మొగిళుల నారఁబెట్టి నిట భూమిని జెర్వులవోలె సుంతయే
నిగముచరించ దా యెచట నేమయిపోయెదొ మిత్రమా! కడున్
బాగలఁగఁ దోచు నీ వెలుఁగుపోచలు మిన్నులెయంటుకొన్నటుల్

తూరుపుకొండ పెంజఱియత్రోవల నారని గండుఱాలపై
నూరక జెల్లుగాలులను నుత్తలమందిన దేమొ చాల కీ
దారిని బోక తప్పదగుఁ దాళుము ధారిణిదేవి మెల్లగా
నూరుపుకొంచునున్నది జలోదరశీతలగర్భవాయువుల్

ఘనములబొడ్డులై కడలి గర్భమునంబడి నీకు సంక్రమిం
చినచలువల్ క్రమంబుగను జెమ్మలుపుట్టును నీదుమేన ని
న్నును వరుణాధిదేవతతనూభవు శైత్యనిధాను గోరువె
చ్చనియలుపంపుగాలు లివి చాలునె యించుకయైనఁ జేయఁగా?

ఒనరఁగ మెట్టదేశములనుండి సముద్రపుఁదీరదేశముల్
చనుసమయంబునందు బలె సాగినగాలులు రానురాను వె
చ్చనివియు గోరువెచ్చనివి చవ్వలునుఁగా జలుచల్లనైనవిఁగా
దనికెను నీప్రభావ మిఁక దాఁగదు దాచఁగరాదు మిత్రమా!

నీదయకోసమై రసధునీమహితాకృతి! వేచియుంటి నీ
వాదుకొనంగనే వలెనయా దరసాదరమేదురాకృతీ!
వేదగ నప్పుడే మొదలు పెట్టితి నింతయుఁ దేరుకొంటివో
లేదో వినూత్నకోపనను లేమఁ బ్రసన్నను జేయుమం చొగిన్

నిన్నుఁ గఠోరగ్రీష్మపరినిందితశైత్యు మహాతపవ్యథా
ఖిన్నుని జూచిచూచి విను కేవల మాత్మపరాయణత్వ మి
ట్లున్నది నిన్ను నే నడుగుచుంటెని కోపన నాలతాంగి నీ
వన్నలినాయతాక్షి నెటులైనఁ బ్రసన్నను జేయుమం చొగిన్

వినుమని యప్పుడే మొదలుపెట్టితిఁగాని మఱీవు విందువో
వినవో సమస్త మట్లునిచి వెచ్చని కల్వపడంతి యూరుపుల్
కనుకని తేర్పఁబోయెదవొ క్రాఁగిన చంద్రశిలావితర్ది కా
ళిని శ్రమ తీర్చుకోఁ జనెదొ లేక యొకించుక యల్లెయుందువో!

సౌదయని సొంతమౌ పనులఁజూచుకొనన్వలెనంచు రాజువై
మొదలిడె దేని నాడునసువుల్ పెనవెట్టెడు నున్నవాఁడు కా
ల్కఁదిపెడుకోన లేనియతగానికిఁ బ్రాణములేమొ పోవునన్
జదురునఁ జేయఁబోకు గుణశాలివి నీ వధికారివయ్యునున్

తొలుతను నాదుప్రేయసి మృదుప్రణయాగ్రహ మొత్తిగిల్లఁగా
సలిపెదవేని నీకలువచానయు నీవ్రనుగూడి. తెల్లవా
రలు సుఖియింపవచ్చు నవురా! పరులన్ సుఖియింపఁజేసి న
ట్టులు నగుఁగాక నీవ యొకఁడున్ సుఖియించిన నేమిగొప్పయో!

నీ వటువంటివాఁడవని నేననుకో ననుకోను వీలులే
దీవు పొనర్చినట్టి పనులెంచినఁ బూర్వమునందు, నెవ్వఁడో
కావలుఁ డట్టివాఁడు క్షణకాలపుజీవి, యుగాలనుండియున్
నీ వినువీథి నిల్చుటయె నీగుణశాలితఁ జాటిచెప్పెడున్

కలువకు నీకునున్ నడుమఁగల్గిన ప్రేమముతోడ నాకు నా
లలనకుఁ గల్గుప్రేమము బలంబునఁ జాలదొ? నీవు మింటిలో
వెలుఁగుట యొక్కగొప్ప యని వేగడు మాస్మదుదార మాంతర
జ్వలితపరంస్వరూప మొకభ్రాంతియె? సృష్టికి మూలహేతువా!

ఇటు లనినాఁడనంచు మది నీసును బెంచుకొనంగఁబోకు తొ
ల్లటి మనమైత్రియందలి బలంబున సామెతగాగఁ జెప్పితిన్
పలుకరణేంద్రియాబలులు బాధవియోగులు నేకశయ్యపై
నిటువలెనున్నవారి నిఁక నేమని చెప్పఁగ వచ్చుఁ జంద్రమా!

కాదొక వేళ నీవు వడఁగాఁగితివే యనుకొమ్ము వెన్నెలల్
సూదులకన్ననుం జెడెనె సౌఖ్యలు తేవనుకొమ్ము పూర్వ మ
ర్యాదలు పోయెనే యమృతమంశువు నీవడఁగాఁగు వేళలన్
లేదని చెప్పఁగానగునె లేదొకఁడే దయ నీకు మాపటన్

డంబము మాని చేతులు నిటాలమునందునఁజేర్చి వెన్నెలల్
డంబులకాంతులొప్పఁ బ్రకటంబుగఁ దెల్లనిదైన యంజలిన్
గంబువుగాఁగఁ జేర్చితిని, గంధిసుడిన్ బొదిగొన్న నీదు జ
న్మంబున శుద్ధియుంచు నయినన్ గరుణింపఁగదే నిశాపతీ !

నీసవిధంబునన్ బ్రణయినీకుపితాకృతిమత్త, నాకుఁ గాం
తాసవిధంబునన్ విరహతాపము, నీవిపరీతమేమొ కా
నీ సరిపోయె, మాటికిని నీ విరియించిన వెచ్చవెన్నెలల్
నాసౌదచాటువుల్ ఫలమునన్ విపరీతతయే భజించెడున్

నీ వొకరాజహంసవయి నింగిని జెక్కలువోని వెన్నెలల్
పూవులకాంతులట్లు పొలుపుల్ పచరింపఁగ సంచరింతు వెం
తో వెడకోపపుం బిగువుతోఁ బెడమోమయియున్న కామినీ
భావములన్ బ్రసన్నతనుఁ బట్టుట కాదియు గాలదూతవై

పూనిన యిట్టి నీదువ్రతమున్ వ్రతమూనిన శక్తిసంపదన్
దా నొకమేటియాచు నరుదారఁగ నేఁటికి వీటఁబుచ్చెదన్
బ్రాణముతోడఁ జేసికొను ప్రార్థనలన్ వినిపించుకోదు పో
నీ నినులెక్కసేయ తగునే నులివెచ్చలు ప్రేమసౌఖ్యముల్

ఎడమకు నొత్రిగిల్లి తలయెత్తదు మెత్తనిదైన మేనిలోఁ
గుడిసగమే మయూఖములకున్ గురియౌనగు లెమ్మటంచు, నీ
యుడుగనివైన గర్భకుహరోజ్జ్వలశైశిరమూలసైన్యముల్
విడుగరపెట్టుమీ మొదలి బింకము లెవ్వరెఱుంగరో శశీ!

పూవులతావిగుమ్ముమని ముట్టినఁ దాళఁగవచ్చు, నేటుకాఁ
డౌ వలరాజు పూములుకు లైదిఁటఁ దాకిన నాగవచ్చు, నా
కోవల గంధవాహములు క్రోల్చిన సైరణసేయవచ్చుఁ గా
నీ వినువీథి నీతనుకు నిక్కిన నాగుదురే లతాతనుల్

పూవులు ఘ్రాణతర్పణము పొంచె శమించును, దెమ్మెరల్ శరీ
రావధికంబుగా నడఁగు, నా వలరాజును నిగ్రహించుచో
నావలఁబోవుఁ, గానియెడ నాతొలియిద్దరు నిద్రగూర్తు రా
పూవులముల్కివాఁ డడరిపోయి విరాగితకూడఁ దెచ్చెదున్

పూవులు తీసివేసినను బోవును, సన్నని గంధవాహముల్
త్రోవలలోఁ దెరల్ తెరలు త్రోఁచిన నూరుపుతీసికోఁదగున్
పూవిలుకాఁడు బాణ మరివోయఁగ దూయఁగ వేళపట్టు గా
దో విఫలప్రయత్నమని త్రోఁచినచో విరమించు వెంబడిన్

నీ కిరణమ్ము లొడ్డుకొననేరరు నీ కిరణప్రసారముల్
రాకలు రాకలై యెడము రావును, నుక్కిరి బిక్కిరాదు ర
స్తోకములైన నీవెలుఁగుత్రోవలఁ జేతులఁ జిమ్ముకొంచు నే
యేకడ కేగినన్ జలువలేచిన వెన్నెలపోఁతలేకదా!

నిను వినువీథిఁబోవునతనిన్ నిలబెట్టి యిదింత చెప్పఁచుం
డినది యెఱుంగదో? వినదొ? నేరపుమాటయొ యన్న, కాదొ పే
ర్కొనఁగను నన్నుఁగాదు నినుగూర్చియె పల్కఁగవచ్చు, మాటయే
వినుటకుఁ గానొ? యెంత వెలివెట్టినదోయి! సుషీమరోచిషా!

ఒకయెదిరేని భార్యల సహో యిఁక భర్త లనంగరాదొ? వా
లిక మఱి నేను నన్నదియు లేదు సరాసరి కోపమెత్తి చూ
లిక యిడి నాటకంబు మొదలించెను నా యనినట్టిమాట నెం
చకుమని యొక్కవందయుపసంహృతులైనవి యేమిసేయుదున్

ఆమెఁ బ్రసన్నఁజేయుటకునైన యుపాయము నీకుఁగాక వే
ఱె మఱియేరికిం దెలియు రేయెలనాగను కృష్ణపక్షబా
ధామతి రోజురోజున కుదారపదప్రచలత్కళానవ
శ్రీమసృణీభవద్ఘుసృణరేఖలఁ దీర్చెదవయ్య చంద్రమా!

ఒకనిషధేశ్వరేంద్రునకు నొక్కమరాళమతల్లి కంబడిన్
ఒకరఘువంశదేవునకు నొక్కప్లవంగమవీరునింబడిన్
ఒకగిరివాసి యక్షునకు నొక్కపయోధరసాధువుంబడిన్
సుకములుకల్గె నిన్నుబడిసూ! సుఖమందఁగ నేను గోరెదన్

వెలఁదికిఁ గ్రొత్తగాఁ బ్రణయబీజమునాటుటయంతకష్టమా!
వెలసిన తావెఱుంగక గవేషణసేయుటయంత క్లిష్టమా!
గొలగొల కొండగుర్తు లిడుకొంచును బోవుటయంతనిష్టమా!
సులభము నాకుదూత్య మిదె సుందరి నాకులపత్ని చంద్రమా!

మా తలిదండ్రులెంతయు సమానముగా మఱియాదమన్ననల్
నీతియు నగ్నిహోత్రములు నిల్చిన వంగసపుంబతాకయా
కూఁతును దెచ్చి నాకు నయి కూర్చిన సాధ్వి, మదేకజీవ, నా
చేతములోని చేతము, హ్రూషీకపువెన్నెలవత్తి, మత్సఖా!

ఈసఖి సద్గుణావళులె యెల్లరు చుట్టములన్ బొగడ్తలం
దూసెడు దాని ప్రాణములతో వెలకట్టును నన్ను నెందు నా
గీసినగీత దాట దిది కేవల మేకతమందు నిండు ప్రే
మాసమకేళి వట్టిపాలయిల్లు కృపాంబుధివౌచుఁ దీర్పవే!

మాకులదంపతిప్రణయమార్గము లీవు నెఱుంగవేమొ కా
నీ! కడుగోప మే నభినయించిన నాయమ నమ్మినట్లుగా
నాకయి యుత్తలంపడుచు నన్ బతిమాలుట చేయఁగల్గుదున్
గాక యదేలనంచుఁ గృతకత్వము నీదెస నాశ్రయించితిన్

అదియును నిప్పుడే సులభమైన యుపాయము దాని వారడిన్
బదిదినముల్ కనుంగొనదు పల్కదు నిల్చినచోటనైనని
ల్వదు పయినెప్పుడో యొకశుభంబగు వేళను దానె వచ్చు నీ
యదనున నీవు సాయమునకై తివో యారతిఁ ద్రుంప్రేమకున్

అంగన యాస్యబింబము ననన్వయమైనది నీకు నాకు, తీ
ర్పంగను రమ్ము నీవు ద్విజరాజువు నాకును నాశ్రయంబు నీ
యంగలవాఁడ వీవ యమృతాంశుఁడవై యమృతాంశమైననా
యంగన లేఁతనవ్వుమొగమా గతిఁ జేయఁగనేర్తు వో శశీ!

అమలినపుష్యరాగములయందుఁ జలించినకాంతికిన్ గపో
లములను గందపూఁత గదలం జని చల్వకుఁ గ్రొంజడన్ బ్రసూ
నములను దావి కప్పుపడినాఁడవు నా ప్రియురాలి కీ యుపా
యమునన యప్పాతీరు సఖుడా! యిపు డామెఁ బ్రసన్నఁ జేసినన్

తేర్చితివేనిఁ జిర్నగవుతీర్చిన పల్వరుసన్ మెఱుంగులున్
మార్చిన వేడుకన్ రతిఁ జెమర్చిన చల్వలు నూర్పుతావులున్
కూర్చిన ప్రేమ నీకు నొడఁగూర్తుము కానుకలు దంపతిప్రజా
భ్యర్చితమూర్తివై తిరుగుమా! చిఱువెన్నెలఁ బంచిపెట్టుచున్

వెన్నెలపేరిదారముల వెండిహొరంగుపటంబు నల్లి మ
ధ్య న్నెఱిగూడుకట్టుకొని యా పెనుదారపుఁ జిక్కులందు నీ
పున్నమదీప్తిచే నిరులపుర్వులఁబట్టి పలార్చుచున్న నీ
యన్నువ వెన్నెలల్ చలువలై మఱి మాకుఁ బ్రసన్నమయ్యెడున్

కోనలఁ బైఁడితీఁగ చెఱకుంగమి పంటపొలాలమీఁద వె
న్నీనినయట్లు లాకసము నెల్లలు నేలను మూలమూల లం
దానికిఁ దెచ్చి కట్టుకొనసాకని వల్లపుఁ జేనిపంట చం
దాన వెలుంగు నీ వెలుఁగుదారులు మాకుఁ బ్రసన్నమయ్యెడున్

కపురపుఁబల్కులట్లు కలకండపొడింబలె సన్నసన్నగా
లిపారల సందుసందులఁ జలించి వెసన్ మణిముక్కఁ ద్రుంచిన
ట్లుపొదలి బైటికిన్ మెఱసి లోపలలోపల చల్లచల్లనై
కృపగల నీదు రేవెలుఁగురేకలు మాకుఁ బ్రసన్నమయ్యెడున్

కలువల సిగ్గుతో నొగరు గంధముప్రాయము నిగ్గుదోఁచి చ
క్కిలిగిలిగింతలోనఁ గిలికించితముల్ సవరించి లేఁత చె
క్కిలిపులకింపులోనఁ దులకింపులు మంపులు తీర్చికొన్న వె
న్నెలలఁజెలంగు నీచలువనీటులు మాకుఁ బ్రసన్నమయ్యెడున్

ఒలసినపిల్లతెమ్మెరల కూఁగిన లేఁతచివుళ్ళ తోరణం
బులు సవరించినట్టి పొలుపో! జగదామయ మొక్కసారి పో
దలుపఁగ నోషధీలతలతోఁ జనుదెంచితో యన్న నీదు వె
న్నెలలు వెలందులున్ జలువనిక్కులు మాకుఁ బ్రసన్నమయ్యెడున్

కరకరి క్రొత్తత్రవ్వి కరకట్టగఁబోసిన నింగిలోనఁ జం
దిరుఁడను తూమునన్ మెఱుపుతీవలచెర్వులనుండి దంపతి
స్ఫురదురుచేతమున్ బొలముబోదెలవెంబడిఁ బర్వులెత్తుచున్
విరిసినజాలు వెన్నెలల విచ్చులు మాకుఁ బ్రసన్నమయ్యెడున్

అనువున మంచుచేఁ బులకలై యిరులన్ గోతిమేరచేను పూ
చినదనఁ, గ్రొత్తపిల్ల తొగచిన్నది వాలికసిగ్గులొల్కఁ జూ
చినదన, రేజగాజిగులు చిందినసోయగ మిట్టుసట్టు మో
చినదన నొప్పు నీ వెలుఁగుచిన్నెలు మాకుఁ బ్రసన్నమయ్యెడున్

నలువుగ వేగవేగ మనమ్ముల భక్తులఁ జేరు మంచుక్రొ
మ్ములదారయల్లువాని మెయి మూఁగిన సన్నని బూదిరేణువుల్
జలజలరాలినట్లుగను జల్లని తెల్లనివై శివమ్ములా
విలసదుదారచంద్రికల వెల్లులు మాకుఁ బ్రసన్నమయ్యెడున్

తెలి సికతాసవర్ణపుళినిన్ బడి జగ్గలుజడ్డలైన గ
డ్డలచిఱుసందులన్ జిలగడమ్ములఁ పూచినయట్లు లంచ పి
ట్టలయెఱకల్ గముల్ కలువడమ్ములు చాచినయట్లు గాడివె
న్నెలతఱితీపు నీ చలువనీటులు మాకుఁ బ్రసన్నమయ్యెడున్

అడఁకువతోడి నాదుప్రియురాలి నిగారపునవ్వు పాయలై
విడివడినట్లు నాసకియ వేసవిపూవులు రాలినట్లు క
న్నడఁదొలఁగించి నాదు నెలనాగయుఁ దెల్లని పైట వీచిన
ట్లూడుపులుచూపు వెన్నెలలయూర్పులుమాకుఁ బ్రసన్నమయ్యెడున్

అవు నినువంటి రాజునకు నంజలిపట్టినఁ బట్టినందమా
నవు నినుఁబోలు సత్పథవిహారినిఁ గోరినఁ గోరినంద ఖిం
తవు నొకమాట నేనడిగినంతటఁబో నపుడే తుషారసా
ధువులగు క్రొత్తవెన్నెలలత్రోవలు తీసితివయ్య చంద్రమా !

నన తెలిడాలు చల్ల కిరణంబులజాలులు గంగనంటియుం
డిన పరదేవుమౌళిపయి నీఝులు కట్టుటచే గడించితో !
మును కడలిన్ మథింప గిరిమూలమునందలి యోషధీలతా
వనులను జొచ్చిచూచి కొనివచ్చితో ప్రాణముఁ దేర్చు నీజిగుల్

ఎందు నకోమలప్రకృతులే పురుషుల్ ననుఁ జాదిచాది నీ
కందువ వెల్గుచాలు పులకల్ ఘటియించెడు, నింక నేమి నా
సుందరి కోమలప్రకృతి సుంకులు చెర్వీన నీదు వెన్నెలల్
పందిరిద్రాక్షతీవతుదఁబట్టిన గుత్తులుగాఁ జెమర్చుఁబో!

తొణికిస లె త్రిపోఁతలుగ దూకిన వెన్నెలజల్లు లొత్తుగాఁ
గొణిదిరి మేనులై ముడుచుకొందురొ కోపముమాలి కౌఁగిళుల్
మణఁగుదురోలతాంగులుసుమాళపుమూఁగతనంపుదూత్యముల్
గొణఁగిన తోఁగుగా విరిసికొన్నది వెన్నెలమాట విందురో

వలపులదూత్యముల్ నడపువైఖరియే యది వేఱు నీదెసన్
చలిమిరిగా రహస్యముగ సన్నగఁ జెప్పనియట్లు చెప్పి కాం
తలును నెఱుంగకే తమకుఁ దాముగ నల్లల జారివచ్చున
ట్టులు పొనరింతు ప్రేమలమడుంగులు కట్టలు పొర్లి పాఱఁగన్

ఈ చలిరేక జాలు లొలయింపు మిఁకొక్కనిమేష మింతలోఁ
జూచెను దీని బింకములసొంపులు, వెన్నెలలోననంచుఁ గ
ట్టా చలిమైన నారుబయటన్ బఱచున్ మృదుశయ్య యీమెకున్
నీ చలివెల్గు ముందటను నిల్చెడునంతటిశక్తి యున్నదే!

వెనుకటి కే నెఱుంగుదును వెన్నెల లీగతిఁ బ్రాణమూలపే
షణములు కావు నాతెలచు సన్నుతిఁ జల్లన చల్లనౌచు వె
ల్లనివెలుఁగుల్ కిలారము వెలార్తువు పొంగిన పాలసంద్రపుం
జినుకులవోలె మాహృదయసీమలు చిందిన వో నిశాపతీ!

చందిరురేక క్రొవ్వెలుఁగు చాలుల చల్లదనంబులెల్ల మా
బాదుగులంచు నీచలువపై బ్రదుకాసలు పెట్టుకొన్న మా
యందున జాలిలేని దొర వన్నది విన్నది కాదయా! దయా
మందిర! నిన్ను మేమెఱుఁగమా! తమిపెంచెదు తావిదివ్వియన్

నీచలివెల్గువెన్నెలల నిగ్గులపందిరిఁ బెండ్లికూఁతురై
నాచెలి పొంగుకోర్కి గళనాళములందునఁ బట్టుతప్పి తా
నై చలియించెడున్ మఱి రవంతకు నామృదుకంఠమాలగాఁ
జాచినచేతులై పరవశత్వముపొందుఁ దదీయకాంతిగా

అల తొలినాఁడు పాల్కడలియందునఁ జిల్కిననాఁడు చిందు చిం
దులతళు కేచి యొజ్జనయి తోఁచుచు బియ్యపురంగుమారి మ
ల్లెలవలె నూత్నకాంతి వెలలించిన మూలబలంబుఁ దెచ్చితో.
చెలువయు నాయురమ్మునను జేరినదోయి ప్రసాదవార్నిధీ!

నను క్షమియింపుమంచు లలనామణి నాచిబుకంబుపూనుఁ గ
మ్మని యొకహేలయొప్ప బతిమాలు నెడంద శిరమ్ముఁ జేర్చి వా
ల్గనులను నామొగంబుఁ గను క్రాగిన నాదునెడంద తేరఁగా
ననితరదేయ మీచలువయంతయు నీదియసూ! నిశాపతీ!

కృతయుగపూరుషుండవు ధరించిన గాండివశక్తినొంచి ది
క్పతులను రాజసూయసవభారము తీర్చితి వట్టి నిన్ను నా
మతిఁ గల దుర్బలత్వమున మానవమాత్రునిగాఁగఁ జూచితిన్
గుఱిలపడంగఁ బోకు మొకకుంటెనకాఁడుగఁ జేసినందుకున్

నిను సకలౌషధీశునిగ నేను నెఱుంగుదు నంతగొప్ప యే
చినయధికారివయ్యు మడిచేలను బంటలు చూచు రైతువై
యునికిని నందఱన్ గలసియున్కిని భేదముపెట్టుకోక యీ
చనవును దీసికొంటిని బ్రసాదము నీగుణమం చెఱుంగుటన్

ఓ ప్రభు యిట్టి నా చనవు నూరక పోకడ వెట్టకుండఁగా
నా ప్రియురాలి మానసమునన్ జలియించితి వామె మంద మం
ద ప్రణయానుష క్తము హృదంతరమున్ గరగించి నేను వా
లై ప్రవహించె నీ వెలుఁగులం బడి త్రవ్విన పిల్ల కాల్వయై

ఒక యుతనమ్ము చేసిన ఫలోదయమై కొనసాగఁజూచు లే
సుకమగు గుండె కీ ఫలముచూడుము నా ప్రియురాలు దానిగూ
ర్చి కతలనల్లి నీకునయి చెప్పితినం చనుచున్న దింత దా
ని కసలు కోపమే కలుగనేరదఁ టే నఁట కోపగించుదున్

ఆవలులై హుతాపములె యగ్నిత సోమత నాహితాగ్ను లే
నీవయి దేవభోజ్యమగు నిన్నును నిన్నడుగంగ నోటయున్
నీవును జేసి పెట్టుటయు నిక్కము సిగ్గుగనున్న దైనన్
దేవర వగ్నిమూర్తివిక దే యిది సైతము నాగ్నికర్మయే

అడుగుటకూడ మానవులయందునఁ జచ్చినయంతపాటు తా
నడిగిన నోరువిప్పి యొకఁ డౌదల వంచుక పోదు రెల్లరున్
జడిముడి నోటలేదనక చేతుల లేదను నొక్కరుండు నీ
తడయక మేలు సేఁత తొలిదాతలనున్ దలపించు చంద్రమా!

ఇత్తు నటంచుఁ దా నథముఁ డీయఁడు రేపులు త్రిప్పి త్రిప్పి తా
నిత్తునటంచు మధ్యముఁడు నిచ్చును తప్పక రేపొమాపొ తా
నిత్తునటంచు నోట ననఁ డిచ్చును వందలు వేలు లక్షలై
యుత్తముఁ డట్టి యుత్తముల నుత్తముఁ డౌదువు నీవు చంద్రమా!

నీదయ నాకు నొక్కనికినే యిపుడే దయచేసినంతటం
గా దెపుడే దయాశిశిరకాంతులఁ జూడవలెఁ మఱెవ్వఁడే
నీ దయితానవప్రణయనిర్భరకోపపుబాళిఁ గుందుచో
నాదుకొనంగనుఁ వలెనయా చలివెన్నెలసోనజల్లుతో

సామివికాసిసూనసరసంబులు దంపతిలోకమంజుల
ప్రేమవిలాసయోగ్యపదవీగమనంబులు సాధువుల్ యదృ
చ్ఛామృదువుల్ దయాభరరసంబులునైన భవన్నహాంశువుల్
గోమహనీయమార్గములకున్ దలమానికముల్ జయించుతన్ !

